ఏర్పడెను. దేవతా రాక్షస యుద్ధములందు సహాయముచేసిన రాజులను స్వర్గమునకు తీసుకొనిపోయి గౌరవించుచుండిరి. అట్టి గౌరవములలో రంభా సంభోగ మొకటి. స్వర్గరాజ్యమున ననేక సుందరవనిత లుండిరి, వారిలో చాలమంది బానిసలుగను, దాస, దాసీజనములుగను నృత్త గీత వాద్య కుశలురై యింద్రుని సభయందుండువారుగ నుండిరి. అట్టివారిలో కోరిన వారిని యింద్రుడు వారి స్నేహితులగు రాజులకు నిచ్చువాడు. సూర్య చంద్ర రాజులు అగ్నిహోత్రాది కైంకర్యములు తమ దేవతలపేర్లను క్రతువు'లను పేరిట చేయుచువచ్చినప్పుడే యింద్రరాజ్యములోని పెద్దలందరిని ముఖ్యముగా బ్రహ్మలను, దేవతలను, యింద్రాది దిక్పాలురను ఆహ్వానించి హవ్యమును (నేతితోగూడిన మృష్టాన్నము) యిచ్చి గౌరవించి యందు పాల్గొననిచ్చి నందులకు ప్రతిఫలముగా నట్టి రాజులకు రంభాది సుందరకన్యలను ప్రసాదించుచు వచ్చిరి. చచ్చినవారికిగూడ నిత్తురను కథ తర్వాత కల్పితమయ్యెను. అవి యింద్రాదులపేరిట నక్షత్రములు వెలసినవిమ్మట కట్టుకథ నిర్మాణమయ్యెను. తనను ఆహ్వానించకుండా చేయు నట్టిక్రతువులనుయీఇంద్రుడు మున్నగువారు భంగపరచుటకై ప్రయత్నించుచుండిరి. ఇంద్రునిరాజ్యము క్రమముగా పామరులనోటబడి హిందూరాజ్యమయ్యెను.

## హిందూరాజ్యము

సింధునది ప్రాంతమున నివసించువారు హిందువు లనబడిరని యొక వాద మున్నదిగాని హిందువులతోగూడిన యీనది సింధు (స + ఇంద్రనది = సింద్రనది లేక సింధునది) యయ్యెనని గ్రహించుట యుక్తమనియు మొట్టమొదట ఇందునదితోగూడి అది సింధునదిగా మారియుండునని లోగడ తెలిపితిమి. ఆ కాలపు ప్రజలకు ప్రజావృద్ధి లేక ప్రజాసృష్టి యొక పవిత్రమైన ముఖ్యకార్యముగా నుండెను. అందుచేతనే ప్రభువులగువారికి వారి దేశపు సుందరవయస్కుల నిచ్చి యింద్రాదులు సృష్టికి తోడ్పడుచుండిరి. రాక్షసులకు, దేవతలకు వైరములు వృద్ధిజెందినకొలదిని యీ యింద్రరాజ్యమునకు ప్రత్యేక రక్షకుడు (Protector) కావలసివచ్చెను. అప్పటికే దేవతలలో ననేక భాగస్తు లేర్పడినట్లు కన్పడును. గరుడ, గంధర్వ, యక్ష,



కిన్నర, కింపురుష, నాగ, నభశ్చర, సిద్ధ, సాధ్య, విద్యాధర, అప్సరసాదులు దేవతలలోనుండి యుద్భవిల్లి యనేక పట్టణములు నిర్మించుకొనిరి. వీరందరిని అవసరమైనప్పుడెల్లను రక్షించుటకై ప్రత్యేకస్థానము ఆవశ్యకమయ్యెను. దీనికొరకే దేవతలందరును కలిసి తమ యందరి శ్రేయస్సు కొరకు విష్ణు వొకనిని యేర్పరచుకొనిరి.

ఈ యింద్రాదులు నాటి ప్రజలే యనుట కనేక దృష్టాంతములున్నను గొన్ని మాత్రమే పైన వ్రాసితిమి. ఋగ్వేదమునందింకను గొన్ని గుర్తులు కలవు. సరమ యను కుక్క (సురేంద్రదూతి) యొకటి దేవశుని పణులు అపహరించిన గోవులను మరలించి తీసుకొనివెళ్ళుటలో సంవాదము సల్పుచున్నట్లొక ఋక్కు తెలుపుచున్నది. (౧౦-౧౦౮) ఇంద్రుని భార్య యొకతె యొక వానరమును గురించి కోపించి తనభర్తతో నా విషయమై వాదించుచున్న యొక ఋక్కుగూడ గలదు. (౧౯-౮౬) ఇంద్రావరుణుల సంవాద మొకటి వారి పరస్పర యౌన్నత్య విషయమై స్పర్థించుచున్నటులు గానుపించెడి దొక ఋక్కుగూడ యున్నది. (౪-౪౨) యాజ్ఞిక క్రియల భారము వరుణాగ్నులలో నెవరు వహింపవలెనను విషయమునకు సంబంధించిన యొక ఋక్కు కనబడుచున్నది. దీనిప్రకార మగ్ని యను యింద్ర సామంతుడు దనకు శ్రమకరమైన యీపనిని స్వీకరించుట కంగీకరించినట్లు సూచన గలదు. ఇట్లు వీరందరా నాటి ప్రజలపై యధికారములు వహించిన నాయకులని స్పష్టముగా దెలియుచున్నది. ఇంద్రుడు రాక్షసులలోని వలాసురుడు, శుష్ణుడు, శంబరుడు, అర్బుధుడు, కరంజుడు, పర్ణయుడు, వంగృదుడు, పిప్రుడు, కృష్ణుడు, రౌహిణుడు, కుయవుడు, పణులు మొదలగువారిని సంహరించినట్లనేక ఋక్కులలో గలదు.

(ఋ 1-10-53, 15-101-2, మరియు 103-2 చూడుము.)

ఇంకను బలాసురుడు గోవులను హరించినపుడు వానిని విడిపించి తెచ్చెను. అంహోయను రాక్షసుని పదమణంచెను. యుద్ధములందు యింద్ర సహాయము బొందిన యీ క్రిందిరాజులు పెక్కండ్రు గన్పడుచున్నారు. నర్యుడు, తుర్వశుడు, యదువు, తుర్వీతుడు, పురుకుత్సుడు, సుదాసుడు, ఋజాశ్వుడు, కుత్సుడు, అతిథిగ్వుడు, ఆయువు. ఇందలి చివరి మువ్వురును సుశ్రవసునకు లోబడజేసెను. ఈ యింద్రుడు శంబరునితో బోరాడినపు